ఓం

జయసంవత్సరాదిని
శ్రీరాజాగోడే
నారాయణగజపతిరాయసింగారు C. I. E.
వారిమహలులో
సంవత్సరాదియందు జరిగించిన
సంకీర్తనానంతరమందు చేసిన
ఉపన్యాసము-



ఏకస్య తస్యైవోపాసనయా పారత్రిక మైహికంచ శుభం భవతి-

ఏకస్య- ఒకడైన, తస్యైవ= వానియొక్కయె, ఉపాసనయా- ఉపాసనచేత, పారత్రికమ్= పరలోకసంబంధము కలదియు, ఐహికంచ= ఇహలోకసంబంధము కలదియును, శుభమ్=శుభమైనది, భవతి- అగుచున్నది.

## అనుశాసనికము.

తమేవ చార్చయ న్నిత్యం
భక్త్యా పురుష మవ్యయమ్।
ధ్యాయన్ స్తువన్ నమస్యంశ్చ
యజమాన స్తమేవచ॥
లోకాధ్యక్షం స్తువ న్నిత్యం
సర్వదుఃఖాతిగో భవేత్

అవ్యయమ్‌—నాశము లేనివాఁడును, నిత్యమ్‌—ఎల్లప్పుడు నుండువాఁడును, లోకాధ్యక్షమ్‌— లోకముల కధిపతియునగు, తమేవ—వానినే, భక్త్యా=భక్తిచేత, అర్చయన్=అర్చించుచున్నవాఁడై, ధ్యాయన్=ధ్యానము సేయుచున్నవాఁడై, స్తువన్= స్తోత్రము చేయుచున్నవాఁడై, నమస్యన్= నమస్కారము సేయుచున్నవాఁడై, యజమానః—పూజించుచున్నవాఁడై, సర్వదుఃఖాతిగః—అన్నిదుఃఖములంగడచినవాఁడు, భవే

త్ — అగును.

---

భగవంతునియందు మనకున్న బాధ్యత ను ఇప్పుడు కొంచెము ఆలోచించుదము- సమస్తసృష్టిజాల పదార్థములయొక్క అనుభవమునిమిత్తము మన కింద్రియము లిచ్చినవాఁడును, మనస్సును బుద్ధియు ను ఇచ్చినవాఁడును, వీనిని యుక్తముగా ప్రవర్తింపఁజేసికొనుటకు మనకు వివేక ముగూడ నిచ్చినవాఁడును భగవంతుఁడే కదా- వానివిషయమై మన కెంతబాధ్యత యుండవలసినది?

ఇదిమనోజ్ఞానమువల్ల తెలియుటయే కాక శాస్త్రమువల్లకూడ తెలియఁబడుచు న్నది.

---

తస్మిన్ప్రీతిస్తస్య ప్రియకార్య సాధనం

చ తదుపాసనమేవ.

తస్మిన్=అతనియందలి, ప్రీతిః—ప్రేమయును, తస్య=ఆతనియొక్క, ప్రియకార్యసాధనంచ—ప్రియమైన కార్యమును చేయుటయును, తదుపాసనమేవ—వానియొక్క ఉపాసన చేయుటయె.

భగవద్గీతలు.

మయ్యావేశ్య మనో యే మాం
నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా
స్తే మే యుక్తతమా మతాః॥

యే మయి మనః ఆవేశ్య— ఎవ్వారలు నాయందు మనస్సును ఉంచి, నిత్యయుక్తాః పరయా శ్రద్ధయా ఉపేతాశ్చ సన్తః= ఎల్లప్పుడును సావధానముగా ప్రవర్తించుచున్నవారును గొప్ప శ్రద్ధతోఁ గూడినవారునగుచు, మామ్ఉపాసతే=న

న్ను ఉపాసించుచున్నారో, తే మే యు
క్తతమాః మతాః = వారు నాకు యుక్తత
ములుగా సమ్మతులు.

---

ప్రీతికరములయిన కార్యములను సా
ధించుటయె అతని ఉపాసనమని పైవాక్య
ములో చెప్పఁబడియున్నది.

నాయందు మనస్సును ఉంచి ఎవ్వరు
సదా ప్రవర్తించుచున్నవారో వారు నా
కు యుక్తతములు అని గీతలలో చెప్పఁబడి
యున్నది.

సమస్తసృష్టిజాలమును చేసిన భగవం
తునిచేత సృజింపఁబడ్డ మనుష్యుఁడు జ్ఞా
న మివ్వబడ్డవాఁడు గనుక, సృష్టిలో ఒక
రికొకరు తోడుపడుటయును, అన్నిప్రాణు
లకును మనుష్యుఁడు సహాయము చేయు
టయును. అతనికి ప్రియకార్యసాధనమని

ఆలోచింౘునము-

లోకవ్యాపారమును త్యజించి కేవలము భగవంతునియెడలనే సదా ప్రవర్తింపుచుండినవారలే మనుష్యులకు ముఖ్యసహాయము చేయుచు వచ్చినారు గదా-

ఋషులవల్లనేకదా మనుష్యునకు తత్వజ్ఞానంబును ధర్మాచరణోపదేశంబును మొదటినుండి కలిగినవి-

పూర్వాచార్యులని ప్రసిద్ధులయినవారు గూడ మనుష్యునకు తత్వజ్ఞానము కలుగుటకు సిద్ధాంతములు ఏర్పఱచియున్నవారు గదా-

మఱియును శ్రీశంకరాచార్యులవారి వల్లనేమి శ్రీ రామానుజాచార్యులవారివల్లనేమి శ్రీమధ్వాచార్యులవారివల్లనేమి స్థాపింపఁబడిన అద్వైతవిశిష్టాద్వైత ద్వైతసిద్ధాంతములయొక్క జ్ఞానములవల్ల వ

ర్తమానములో హిందువులు ప్రవర్తింపు చున్నారుగదా-

ఇవియును అతని ప్రియకార్య సాధనములేగదా-

ఇఁక లౌకికులనుగుఱించిఆలోచింతము- మనకు భగవంతుడు ఇంద్రియముల నిచ్చి వివేకమునుగూడనిచ్చియున్నాఁడు.

కఠోపనిషత్తు

యస్తు విజ్ఞానవాన్ భవతి
యుక్తేన మనసా సదా।
తస్యేంద్రియాణి వశ్యాని
సదశ్వా ఇవ సారథేః॥

యస్తు= ఎవ్వఁడు, విజ్ఞానవాన్= వివేకియును, సదా= ఎల్లప్పుడును, యుక్తేన మనసా= యుక్తమైన మనస్సుతోఁగూడు కొనినవాడును, భవతి=అగుచున్నాఁడో, తస్య= వానియొక్క, ఇంద్రియాణి= ఇం

ద్రియములు, సారథేః= రథికుని యొక్క, సదశ్వాఇవ= మంచిగుఱ్ఱములవలె, వశ్యాని= స్వాధీనములగునవి, భవంతి= అగుచున్నవి.

---

ఇంద్రియములు స్వాధీనములగుటవల్ల ఏమికలుగుచున్నది? ధర్మాచరణమేకదా.

సమస్తమతములును ధర్మాచరణమును గురించి యొక్కవిధముగానే చెప్పుచున్నవికదా.

---

౧ హిందూశాస్త్రము

---

౧ తైత్తిరీయోపనిషత్తు.

సత్యాన్న ప్రమదితవ్యమ్। ధర్మాన్న ప్రమదితవ్యమ్। కుశలాన్న ప్రమదితవ్యమ్।

౨ ప్రశ్నోపనిషత్తు.

సత్యం వద। సమూలోవా ఏష పరిశుష్యతి

యోనృత మభివదతి॥

౩ తైత్తిరీయోపనిషత్తు-

ధర్మంచర। ధర్మాత్పరంనాస్తి। ధర్మ
స్సర్వేషాం భూతానాం మధు।

౪ మనుః

ధృతిః క్షమా దమోస్తేయం
శౌచ మింద్రియనిగ్రహః।
ధీర్విద్యా సత్యమక్రోధో
దశకం ధర్మలక్షణమ్॥

౫ భారతము- శాంతి॥

అక్రోధ స్సత్యవచనం
సంవిభాగః క్షమా తథా।
ప్రజన స్స్వేషు దారేషు
శౌచ మద్రోహ ఏవచ॥
ఆర్జవం భృత్యభరణం
నవైతే సార్వవర్ణికాః।

౬ వరాహపురాణము

అహింసా సత్య మస్తేయం
బ్రహ్మచర్యం ప్రకీర్తితమ్।
పతాని మానసా న్యాహు
ర్వ్రతానితు ధరా ధరే

---

అబౌద్ధశాస్త్రము

---

౧శాక్యబుద్ధుడు చెప్పినది।

ప్రాణహరణము- వ్యభిచారము-అబద్ధమాడుట- ఒకరి వస్తువును కాంక్షించుట- అసూయ- ఇవిపరిహారించ తగినవి-

స్వీకరించ తగిన వేమనఁగా- ధర్మము చేయుట- సౌలభ్యము- దయ- అన్యుల ను తనవలె చూచుకొనుట, ఇవి స్వీకరించ తగినవి-

శ్రీపభవస్వామియనెడు

జైనఋషి చెప్పినది.

పరిశిష్టపర్వము.

ప్రభవస్సా మ్యథాచక్ష్యా
వహింసా ధర్మ ఆదిమః।
చింతనీయ శ్శుభోదర్కో
యథాత్మని తథా పరే॥

3 చీనా దేశపు కాంఫిస్యుయస్
అను ఋషి చెప్పినది.

తల్లిదండ్రులయందు భక్తి యుంచుము. అనుజన్ముల యందు ప్రేమ యుంచుము. ఋజుమార్గముగా నుండుము. నీకున్నది ఎక్కువగా సమర్పించుము. అన్యులయొక్క దుష్కార్యమును బయటబెట్టకుము. నీయొక్క ఆధిక్యమును గురించి యెంచకుము. అన్యులయొక్క బాగునుగురించి సంతోషించుము. లోకులకు వచ్చెడి ఆపదలనుగురించి కనికరించుము. అనగా సహాయముచేయుము. పురుగులకు సయితము,

ల్లకుసయితము, చినచిన్న మొక్కలకున యితము, ఏవిధమైన హానిని చేయకుము-

---

3 జరదుష్ట్ర అనెడు
పారసీ శాస్త్రములో చెప్పనది.

---

౧ శుచిగానుండుటను నేర్చుకొనుము- యోగ్యప్రశంసకు తగిన ట్లుండుము- మనస్సున మంచి తలంపులు తలంచుము- వాక్కులు శుభముగా పలుకుము- కార్యములు శుభముగా జేయుము- చెడుతలంపులను పోగొట్టివేసుకొనుము- చెడ్డమాటలను తగ్గించివేయుము- దుష్టకార్యములను దగ్ధము చేయుము-

౨ ఎవరైతే బీదవాండ్రను భోజనపదార్థములిచ్చి పోషింతురో వారిని కొనియాడుదము-

3 సత్యమైన ఆలోచనము- సత్యము

౫ మాటలాడుట-సత్యముగ ప్రవర్తించుట-వీటిని బట్టి పరిశుద్ధుఁడైన పూరుషుని కలసి కొనును.

---

౪ రోమహూదిశాస్త్రిములో
అనగా బైబిలులో పూర్వభాగములో
మోజెస్ అనెడిదీర్ఘదర్శి
యొూశా్ౕరిపుస్తకములో వ్రాసినది-

---

౧ త్వం నిజపితరం మాతరంచ సంమన్యస్వ- తేన తవప్రిభుః పరమేశ్వరో యందేశంతుభ్యం దాస్యతి, తస్మిఁదేశేతవదీర్ఘకాలమ్ ఆయుర్భవిష్యతి- నరహత్యాం మాకార్షీః- పరదారాన్ మాగచ్ఛ- చౌర్యం మాకార్షీః-స్వస్యసమీపవాసినోజాయాయాంవా దాసేవా దాస్యాంవా గవివాగర్దభేవా కస్మింశ్చిద్వస్తుని లోభం మాకార్షీః-

బైబిలులో ఉత్తరభాగము
క్రీస్తువారి శిష్యులగు మాథ్యూఅను నాయన
క్రీస్తువారు చెప్పిన సంగతులు వ్రాసినది.

---

౧ యూయం స్వశత్రూన్ ప్రతి ప్రేమ
కురుత- యేయుష్మాన్ శపన్తి, తానాశిషం
వదత- యేయుష్మాన్ ద్విషంతి తేషాంహిత
మాచరత- యేయుష్మా నపవదన్త్యుపద్రవన్తి
చ తేషాంకృతే ప్రార్థనాం కురుత-

౨ అతస్త్వయా స్వకీయోపహారే య
జ్ఞవేదిమానీతే, తవభ్రాతుర్మనసి తద్విరు
ద్ధా కథావిద్యతఇతి తత్రచేత్ స్మరసి, త
ర్హితత్ర స్వకీయోపహారంయజ్ఞవేద్యాస్సన్
ముఖేవిహాయ యాహి- ప్రథమం స్వభ్రా
త్రా సంమిలితో భవ- తతః పరమాగత్య
స్వకీయోపహారం నివేదయ-
3 యః కశ్చిత్ తవ దక్షిణకపోలే చ

పేటాఘాతం కరోతి, తంపశ్చాన్యతరం క
పోలమపి వ్యాఘోటయ.

౫ మహమ్మదీయ శాస్త్రమైన
ఖురానులో చెప్పబడ్డది.

న్యాయమునకును ధర్మమునకును ఒకరి
కొకరు సహాయముగ నుండుడు. మఱియు
ను అన్యాయమునకును ఇంక అసూయకు
ను ఒకరి కొకరు తోడుపడవలదు.

మనము ఈశ్వరుని గుఱించి మిక్కిలి ప్ర
పన్నులమై ప్రాణివ్యవహారమును అనుస
రించి నడవవలసినదే కదా.

కొందఱు యోగులుగూడ ఇంద్రియవశ్య
త వల్లనే కదా భగవద్ధ్యాన పరాయణతక
లిగి మార్గముయొక్క అంతమును అనగా
విష్ణు పరమపదమును పొందుచున్నారు.

మనుః

విజ్ఞాన సారథి ర్యస్తు

మనః ప్రగ్రహవా న్నరః।
సోఽధ్వనః పారమాప్నోతి
త ద్విష్ణోః పరమం పదమ్॥

యః నరః= ఏ నరుఁడు, విజ్ఞానసారథిః= విజ్ఞానమే సారథిగాఁగలవాఁడో, మనః ప్రగ్రహవాన్= మనస్సే పగ్గములుగాఁగల వాఁడో, సః= వాఁడు, అధ్వనః= మార్గము యొక్క, పారమ్= అంతమును, ఆప్నోతి= పొందుచున్నాఁడు- తత్= అదియె, విష్ణోః= విష్ణువుయొక్క, పరమమ్= ఉత్కృష్టమైన, పదమ్= స్థానము-

---

ఇంక అతనియందు భయభక్తులతోఁగూడిన నడవవలసినదిగదా. భక్తిలోనే ప్రేమయును కృతజ్ఞతయును గూడ చేరియున్నవి.

బృహన్నారదీయపురాణము.

విష్ణోర్భక్తిః పరా న్నృణాం

సర్వపాప ప్రణాశనీ।
భక్తిమద్భిః కృతంకర్మ
సఫలం స్యాన్మహీపతే।

హే మహీపతే=ఓ రాజా, నృణామ్=న
రులకు, విష్ణోః= అంతటవ్యాపించియున్న
భగవంతునియొక్క, సర్వపాప ప్రణాశ
నీ=సమస్త పాపంబులను నశింపఁజేయు,
భక్తిః = భక్తి, పరా= శ్రేష్ఠమైనది-
భక్తిమద్భిః= భక్తిగలవారలచే, కృతమ్=
చేయఁబడిన, కర్మ=పని, సఫలమ్=ఫలవంత
మైనది, స్యాత్= అగును.

పునశ్చ.

యేఽభినన్దన్తి నామాని
హరేశ్శ్రుత్వాఽతిహర్షితాః।
రోమాంచిత శరీరాశ్చ
తేవై భాగవతోత్తమాః

యే= ఎవ్వరు, హరేః= హరియొక్క, నా

మానీ- నామములను, శృత్వా- విని, అతిహర్షితాః= మిక్కిలి సంతోషింపుచున్నవారై, రోమాంచిత శరీరాః= గగుర్పాటుతోఁగూడిన దేహములు కలవారై, అభినన్దన్తి- ఆనందింపుచున్నారో, తేవై= వారలే, భాగవతోత్తమాః- భాగవత శ్రేష్ఠులు.



ఈ పృథివిలో నొక రాజు శాసించునని భయముండి యుక్తముగ పనులు చేయుచుండఁగా, సర్వశాసకుఁడైనఅతనియందు భయము మనకు లేకుండ నుంటే నేపనిని మనము యుక్తముగా చేయఁగలము?

కనుక నే

మహద్భయం వజ్రముద్యతమ్, అని చెప్పఁబడి యున్నది.

ఆతని ప్రియకార్యములు చేయుచునున్నప్పటికిని ఆతనియందు భయభక్తులు క

లిగియున్నప్పటికిని అతని అర్చనయును అతని
ధ్యానమును చేయుట మనకు ముఖ్యముగదా-
అందువల్ల మనము భగవంతునియందు
సదా నిష్ఠకలవారమై యుండుటయే కా
క అతని ప్రియకార్యములు చేయుటకు మ
ఱియింత ప్రోత్సాహము కలుగుచున్నది.
మఱియును మన శక్త్యనుసారముగ చే
సెడి అర్చనయును ధ్యానమును అతని చేనంగీ
కరింపఁబడుచున్నవని కూడ చెప్పఁబడ్డది గదా-

గీతలు-

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః॥

యః = ఎవ్వఁడు, భక్త్యా=భక్తితోడను, ప
త్రం పుష్పం ఫలం తోయం మే ప్రయచ్ఛ
తి= ఆకునను పూవునను పండునను నీటి

నిని నా'స ఇచ్చుచున్నా(డో, తక్ర్యప)యతా
త్మనః= ఆ పరిశుద్ధమైనమనస్సు కలవా
నియొక్క, భక్త్యుపహృతం తత్ అహమ్
అశ్నామి=భక్తిచేత సమర్పింపఁబడినదాని
ని నేనుఅనుభవింపు చున్నాను-

పునశ్చ

అనన్యాశ్చిన్తయన్తో మాం
యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభి యుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్॥

అనన్యాః మామ్ చిన్త యన్తః యే జనాః
పర్యుపాసతే= అనన్యులై నన్ను చింతింపు
చున్న ప్రజలు ఉపాసింపుచున్నారో, ని
త్యాభియుక్తానాం తేషాం యోగక్షేమమ్=
నిత్యాభియుక్తులగు వారియొక్క యోగక్షే
మములను, అహం వహామి= నేనువహింం
పుచున్నాను

